తన కతివత్వమునకై తన్ను మందలించుచున్న రోయక మాంసాహారియగు పెద్దమనిషినిజూచి, వికటముగనవ్వుచూ, "దయా! ఎక్కడనుండి తేచ్చెరు? అది చచ్చిపోయినది. మిక్కరే దానిం చంపివేసితిరి. మీబోంట్లే మాబోంట్లను కటికె గుండెవారిని తయారు చేయుచున్నారు:" అని పలికెనట. ఇంకలి సత్యము నెవరేని నిరాకరింతురా?

తమ వృత్తియాగు కసాయి వారికి కూడ అసహ్యమే గలదుగాని గత్యంతరము లేక వారు దానిని జేయుచున్నారు. "మనుష్యులకు మాంసము కావలెను. అందుకై జంతు వధ జరిగి తీరును మేము కాకున్న యింకొక రీవధ చేయుదురు. పనిమాని వేయుటచే, మాకూడుమాత్రము పోవును" యని వారు బలుకుదురు. ఇట్లు సంఘమే కసాయివారి అధమ గతికి కారణము. యీడ వారివలన లాభమేమియు లేదు వారి నుద్ధరించు ప్రయత్నములు కూడ నిష్ఫలములు.

## మేధాశక్తి

మేధాశక్తులకును, ఆహారమునకును కొంత సంబంధము గలదు. శారీరక పరిస్థితులు మానసిక వ్యాపారముపై కొంతవరకును అధికారము చేయునని అందఱికి దెలిసిన విషయమే. సాత్వికాహారముచె పుష్ట శరీరము, శారీరక వాంఛలు, రాగములు సంస్కారమగు కొలది మన మేధాశక్తులు కూడ సున్నితములును, ఉత్కృష్టములును అగుచుండును. ఫ్రెంచి విద్వాంసుడగు ఫోరో "నివమెక్క ఉత్కృష్టశక్తులను, కవిత్వభావములను ఉచ్ఛస్థితిలో పోషింప కాంక్షింతు వారందఱును మాంసాహారము పట్ల ముఖ్యముగా విముఖులై యుందురు" ని వచించియున్నాడు. "సామాన్య జీవనము, ఉత్కృష్టాదర్శావలంబనము" అను అనాదినుండి ప్రాచ్య దేశములలో నాచుకొనుచున్న ఆచారము కూడ ఫోరో సిద్ధాంతమునకు సమ్మతముగ నున్నది. ఇంతే కాక ప్రపంచ చరిత్ర పరీక్షించి మహా పురుషుల జీవితములను పరిగణించినచో యీ సూత్రము తేట తెల్లమగును.

యూనివర్సిటీ కాలేజి (లండను) లో ప్రొఫెసరుగానున్న ఫ్రాన్సిసు న్యూమను గారు పై విషయముగూర్చి ఈ క్రింది యంశములను దెలుపుచున్నారు.

మాంసము నెగుమతిజేయు నొక పెద్ద కంపెనిలో ప్రతిదినము జరుగు పశుబలి.

౧౫ మైళ్ల పొడుగున జతలుగ బోవుచున్న ౧౦ వేల ఆవుల వరుసను భావింపుడు; వాని వెనుక ౧౨ మైళ్ల పొడుగున ౨౦ వేల గొఱ్ఱెలను పోనిండు; వాని వెనుక ౧౬ మైళ్ల పొడుగున ౨౪ వేల పందులను తరుముడు; అటుపైని ౯ మైళ్ల తరవడి ౩౦ వేల కోళ్లను రానిండు; ఈ జంతుసమూహము మొత్తము ౫౨ మైళ్లు వ్యాపించును; వానిని తినవచ్చో ఒకపట్టణము చేయుటకు ౪ దినములు పట్టును. ఈ ఆహారజీవరాశిని స్విఫ్టులింకనులో వారు ఒక్కదినముననె చంపుచున్నారు.

చికాగో నగరమున ఒక కంపెని మాత్రమే గోవులు, గొఱ్ఱెలు, పందులు కలిపి ౭౦ లక్షల జంతువులను ఒక్క సంవత్సరములో బలిచేసెను. వీనిని చంపుటకు ౧౫౭౪౩౩ మంది మనుష్యుల నియోగించెను.

ఇంగ్లాండులో ఒక సంవత్సరమునకు ౧౦ లక్షల గోవులు, ౬౦ లక్షల గొఱ్ఱెలు, ౨౦ లక్షల పందులు చంపబడు చున్నవి. దీని వలన రాత్రింబవలు నిమిషమునకు ౨౦ ఘాతుక మరణములు జరుగుచున్నవని తెలియగలదు. అనుదినము చంపబడుచున్న వేనవేలు కుందేళ్లు, చెవుల పిల్లులు, కోళ్లు, బాతులు, పిట్టలు, ఇవి. చిపెట్టినచో ఈ లెక్క హెచ్చుచున్నది.

క్రైస్తవ దేశములలో ౧౦ లక్షల గోవులు, గొఱ్ఱెలు, పందులు చంపబడు చున్నవి. అనగా దివారాత్రము లదేపనిగా నిమిషమునకు ౭౦౦ లేక సెకండుకు ౧౧ జంతువులు చంపబడు చున్నవి.

## శాకాహారులగు మహాపురుషుడు

పైథాగోరస్—గ్రీకుదేశపు సుప్రసిద్ధ గణిత శాస్త్రజ్ఞుడు

# విశేషములు

## పరామర్శలు

ప్రపంచములో పరామర్శించు విషయమున ఏయే దేశములో ఒక్కొక్క ఆచారము గలదు. హిందువులు ఒకరు నొకరు గాంచినంతనే చేతులు జోడించి నమస్కారముచేసి "క్షేమమా" యని కుశలప్రశ్న చేయుదురు. తురకలు "మీకు శాంతి కలుగుగాక" యను నుడువును. ఇంగ్లీషువారు ఒండొరుల కరస్పర్శ గావించి "ఎట్లాయున్నారు" అని పరామర్శింతురు. ఈజిప్టుదేశమువారు "మీ కెట్లా చెమటవేయుచున్నది" యని యడుగుదురు. చైనా దేశమువారు "అన్నము తిన్నారా" యని ప్రశ్నింతురు. మూరుజాతివారు ఒండొరుల భుజములను ముద్దుపెట్టుకొందురు. సౌతుసీ ఐలెండువారు ఒకరొకరి ముక్కులు రాచెదరు. ఫిలిప్పైను దీవి ఆదిమవాసులు తాము పరామర్శింప బోవువారి కాలుచెయి పట్టుకొని తమ ముఖమును రాచెదరు. ప్రాచీన రోమకులు "మీబల మెటులున్నది" యని కుశలప్రశ్న వేయుదురు. గ్రీసు దేశమువారు "మీ రేకార్యమున నియోజితులై యున్నారు" అని ప్రశ్నించుచుండిరి. ఫ్రాన్సుదేశమువారు "మీదర్శన భాగ్యమువల్ల నాకెంతో ఆనందము గలిగినది" యని అందురు. "మీ కెట్లా యున్నది" యని జెర్మని దేశమువారు పరామర్శింతురు.

## చెవిటివారు

డాక్టరు ఆక్టేవియా లెవినుగారు చెవిటి వారిలో ఆరువంతులలో ఐదువంతులు నోరుగుండా గాలి పీల్చుట వలన గలుగుచున్నదని సిద్ధాంతీకరించిరి. బొడచుట్టు చిగురుకొలదులు, ముక్కుమీద బిగుతు మూలనముల వలన ముక్కు మూలమున సులభముగ శ్వాసనిశ్వాసములు జరుగవనియు, అందు మూలమున రోగములకు కారణభూతి మగుననియు నుడివిరి.

## ౧౫౦ సంవత్సరములు బ్రతుకుట

ప్రతిమానవుడు ౧౫౦ సం॥లు భావికాలమున బ్రతుక గలడని సుప్రసిద్ధ ఫ్రెంచివైద్య శాస్త్రజ్ఞుడగు ప్రొఫెసరు సెర్జివొరొనాఫ్పుగారు అభిప్రాయ పడుచున్నారు. ముసలి వారిని పడుచువారిగా చేయవచ్చునని నొక్కి చెప్పుచున్నారు. ఇట్లప్పుడే ౨౦౦ ముసలివారిని యౌవనులుగ జేసియున్నారు. చింపాంజీ (కోతుల రక్తోత్పాదనకు సేకరించు అంగములు) గ్రాండ్సును దీసి వృద్ధుని గ్రాండ్సు స్థానమందు అతికినచో పునః యౌవన ప్రాప్తి గలుగును.

## సినిమా నాటకులు

సుప్రసిద్ధ సినిమా నటకులు వారమునకు లక్ష రూపాయిలు చొప్పున కూడ ఆర్జింతురు. కాని సినిమా నాటకమును తయారుచేయునపుడు వారికి కలుగు ప్రమాదములు గూడ దానికి తగినట్లే యుండును. టామ్‌మిక్సుయను అమెరికా దేశపు సినిమా నాటకుడు అత్యంతధనము తన నటనవలన ఆర్జించుచుండును. కాని నేటివరకు కాతనికి గలిగిన ప్రమాదముల సంఖ్యయిది—ఎనిమిది తుపాకిగుండ్ల దెబ్బలు; ౧౨ దెబ్బల మచ్చలు; ౧౨౭ కుట్లు. రెండు దండలు; కాళ్లు విరిగిపోవుట; మూడు విరిగిన పక్కటెముకలు; ఒక విరిగిన పుర్రె:—

## స్త్రీల కసరత్తు

పశ్చాత్య దేశములలో శరీరారోగ్యము కొరకును, విఖ్యాతి కొరకును స్త్రీలు వివిధ వ్యాయామ పద్ధతులను, కసరత్తులను, ఆటలను, వారివారి కోరికల బట్టి అవలంబించుచుందురు. ఖ్యాతికొరకై ఒక స్త్రీ ౨౧ మైళ్ల ఇంగ్లీషు చానలును ఈదెను. ఇంకొక స్త్రీ జిబ్రాల్టరు స్ట్రెయిటును ఈద యత్నించుచున్నది. మిసెస్ గనుయను నామె ఫేలనములో వాల్టాలి ౧౫ అడుగుల ౩౪ అంగుళములు పొడుగు దూకినది.

## అద్భుతమగు గడియారము

జూరిక్ నగరమందలి పాలిటెక్నికు విద్యాలయమున ఒకవింత గడియారము గలదు. దీనికి ఇతర గడియారములకు వలె కీయివ్వ నవసరములేదు. వాతావరణమందలి వేడి ౧౦ డిగ్రీలు మారినచో, ఈ వార్షిక గడియారములోని యంత్రము నడచును.

## విద్యకై వెచ్చము

సర్వతోముఖ దేశాభ్యుదయమునకు విద్యయే ప్రబల సాధనమని పాశ్చాత్యులు బాగుగా గుర్తెరిగియున్నారు. అందువల్లనే ప్రభుత్వమువారు, శ్రీమంతులు, ప్రజాహిత సంస్థలు, మున్సిపాలిటీలు విద్యకై ఎంతయో వెచ్చించుచుందురు. ఒక్క లండను నగరములోనే సంవత్సరమున ౧౭ కోట్ల ౫౦ లక్షల రూపాయిలు విద్యకై వినియోగించుచున్నారు.

## సుయెజు కెనాలు

ఈ కెనాలు, యూరపును, ఆశియా ఖండమును, సముద్ర మూలమున దగ్గఱ జేసినది. ఇది బ్రిటిషువారి స్వాధీనములో నున్నది. ఇండియా దేశమునకిదియే ముఖ్యమైన మార్గము. అందుచే దీనిని బ్రిటిషువారతి జాగరూకతతో, చేతినుండి జారకుండ, పోషించుచుందురు. దీని పొడగు ౧౦౩ మైళ్లు. దీనిఅత్యధిక వెడల్పు ౩౫౦ అడుగులు. సగటున దీనిలోతు ౩౫ అడుగులు.

## కుక్కల పందెములు

పిల్లులు, కుక్కలు అని ఇంగ్లీషువారి కెక్కువ మచ్చట. సుమారు నూరు జాతుల కుక్కలు యింగ్లండులో నుండును. సాధారణముగా పోటీలు జరుగుచుండును. ఒక్కొక్క జాతిలో ప్రశస్తమైన వానికి బహుమతు లిచ్చుచుందురు. కుక్కల (పరిగెత్తు) పందెములు కూడ జరుగుచుండును. ఈ పందెముల నడపుటకై ౧౧౫ కంపెనీ లున్నవట. దీనికై ఒకకోటి ౭౦ లక్షల రూపాయిల మదుపు ఉన్నది.

## మెఱుగుడు పురుగులు

మెఱుగుడు పురుగుల తళతళలు, సాంధ్యచీకటి రాత్రులలో, నిబిడతరు పుంజముల దరిజూడ వలెను. ఇవి సాధారణ దినములలో కంటె, తుపాను రానున్నదనగా ఎక్కువ కాంతితో ప్రకాశించునట. సౌతుసీ దీవులలో వీనిని బట్టుకొని; కట్టెల కంటించి దివిటీలుగా నుపయోగింతురు.

## క్రొత్త పద్ధతి ప్రకటన

వార్తాపత్రికలు; పుస్తకములు; క్యాలండరులు బండ్లు, బొమ్మలు, ప్రకటన కుపయోగిస్తున్నారు. ఇదిచాలక ఇంగ్లండులో వర్తకులాకాశ ప్రకటన నారంభించుచున్నారు. ఒక యంత్రము మూలమున రాత్రి వింతవింత రంగుల కాంతికిరణములతో ఆకాశమున చాలదూరము కనబడునటుల పెద్దయక్షరములలో ప్రకటన చేయుదురు. ఈ యంత్రమును విలియము ఆల్లయ గారు కనిపెట్టిరి. ఇట్టిదానిని అమ్మకమునకు తయారుచేయుటకై ఒక కంపెని స్థాపించిరి. ధరసుమారు రెండున్నర వేల రూపాయిలుండు ననుకొనుచున్నారు.

## ఎలక్ట్రిసిటీమూలమున పడిశము కుదుర్చుట

పడిశము పోవుటకు ఎలక్ట్రిసిటీని వినియోగించుచున్నారు. రెండు లోహపు బద్దలను ముక్కు పుటములలో బెట్టి వేడిచెక్కింతురు. ఎంతోమంది వీటుల దాగుచేయుచున్నారు.

## పండ్లద్వారా వినుట

పండ్ల మూలమున గూడ గ్రామఫోను సంగీతము వినవచ్చును. రబ్బరుచివర తగిలించియున్న పెన్సలు దెచ్చి, రబ్బరులోగుండ ఒకసూదిని దూర్చవలెను. ఆ సూదిని గ్రామఫోను రికార్డుమీద బెట్టి, పెన్సలు రెండవ కొనను నోటిలో బెట్టుకొనిన, పైకి ఎట్టిధ్వని లేకపోయినను పాటవినవచ్చును. చెవులు మూసికొనినచో సంగీతమింకను స్పష్టముగ వినవచ్చును.

---

## వివిధ విషయములు

### మద్రాసుసభ గలభా

మంత్రులగు రంగనాథ మొదలియారు, ఆరోగ్యస్వామి మొదలియారు గారు తమ పదవులకు రాజీనామా యిచ్చుటచే చాలా కలవరము బయలుదేరినది తమ రాజీనామాకు కారణ మిదియని రంగనాథ మొదలియారుగారు ప్రకటించి యున్నారు — మొన్న శాసన సభలో డాక్టరు సుబ్బరాయను గారిపై తేబడిన ఆ విశ్వాస తీర్మానము చాలినంత మంది సభ్యులు రాక పోవుటచే ఊగిపోయెను దీనిబట్టి, శాసన సభ యిదివఱలో కమిషను బహిష్కరింప వలెనని జేసిన తీర్మానము రద్దుపడెనని గవర్నరుగారు సిద్ధాంతీకరించుచున్నారు కాని ఇది అసమంజసము కమిషను బహిష్కార తీర్మానము రద్దు కాలేదని మా అభిప్రాయమగుటచే మా పదవులకు రాజీనామా యివ్వవలసి వచ్చెను గవర్నరుగారి సిద్ధాంతము రద్దుపఱచుటకు రాష్ట్రమంతటను బహిరంగ సభలు జరిగి శాసన సభ బహిష్కార తీర్మానమును బలపఱచ వలెను

### మద్రాసు మంత్రివర్గపు విషమస్థితి

మంత్రివర్గ పక్షమువారు ౧౦ మార్చిని స్వీకట రేటునందు సమావేశమై, రంగనాథ మొదలియారు, ఆరోగ్యసామి మొదలియారుగార్లు మంత్రి పదవులకు రాజీనామా యొసగుటచే నేర్పడిన పరిస్థితుల చర్చించిరి

ప్రస్తుతము ఖాళీయైన రెండు మంత్రి పదవులను తిరిగి తమ పక్షమువారిచే నియమింపవలెనా లేక మరియొక పక్షముతో కలిసి సంయుక్త మంత్రివర్గము నేర్పఱుపవలెనా యను విషయము చాలసేపు చర్చ జరిగెను కాని సభ్యులందరును ౧౩ తేదీన చర్చించుటకు నిశ్చయించుకొని వెడలిపోయిరి

### "హిందూస్థాన్ టైమ్స్"

హిందూస్థాన్ పత్రికా విలేఖరి యగు చమన్‌లాల్‌నకు ఆండర్సన్ గారు సర్ బేసిల్ బ్లాకెటుగారి తలపై పెట్టెను విసరికొట్టుటచే ౩ మాసముల కారాగార శిక్ష యైనను లేక ౫౦౦ రూపాయిల జరీమానాయైన నిచ్చునటుల తీర్పు చెప్పిరి

### హిందూమత స్వీకారము

గోవా బ్రహ్మచారి ఆనందమూర్తి గారు హిందూమహాసభవారి పక్షమున అచ్చట ౩ వేల క్రైస్తవులను శుద్ధిజేసి హిందూ మతమునందు కలుపుకొనిరి ఇంకను ఎక్కుడగు క్రైస్తవులు హిందూమతమును స్వీకరించుచున్నారని కూడ తెలియుచున్నది.

### అరేబియా యుద్ధభయము!

సుల్తాను ఇబిను సావుదు గారికిని ఇరాకు ప్రభుత్వమునకు యుద్ధము వచ్చునని మూడవతేదీ, లండను నుండి వచ్చిన ఫ్రీప్రెస్ తంతివార్తల వలన తెలిసెను.

ఇబిను సావుదు సుల్తానుగారి కోపమునకు కారణము విదేశీయుల కుట్రయేయని తెలియుచున్నది

ఇరాకు ప్రభుత్వమువారు ఒకయిరు ఒడంబడికకు విరుద్ధముగ బునేయాదగ్గర సైనిక కావలిస్థానమును నిర్మించిరి ౧౯౨౨ సంవత్సరమున గ్రేటు బ్రిటను తరపున సర్ పెర్సీకాక్సుగారు సంతకము జేసిన ఒడంబడికలో మూడవ అనుబంధమును అట్టిపని జేయు వారము కామని ఇరాకు ప్రభుత్వము ఒడంబడెను

బునేయాదగ్గర సైనిక స్థానము నేర్పఱుచుట తమ ఒడంబడికకు భిన్నమని వాహాబీ లనుచున్నారు నిజదు నజంబను మధ్యభాగమున ఇబిను సావుదు సుల్తానుగారు ఎన్ని పర్యాయములో ఇరాకు ప్రభుత్వమునకు తమ అసమ్మతిని తెలిపిరి కారణమేమనగా తుద కు వాహాబీలు, షేక్ ఫెయిసూలు—ఆడ్—డావిషగారి యాజమాన్యమున బునేయా సైనిక స్థానమును ముట్టడించి భూమితో దానిని సమముజేసిరి

దీనికి ప్రతిక్రియగ బ్రిటిషు వైమానిక దళములు వాహాబీతెగల గ్రామములపై బాంబులను బరపుచు వాహాబీలకు ప్రాణనష్ట మొనరించ గల్గెను

ఈ వైమానిక ముట్టడిచే ఇబిను సావుదు సుల్తానుగారు కోపోద్దీపితులైరి తత్కారణమునంజేసి ఇరాకు వైమానికాశయముపై, ౫౦ వేల వాహాబీల సైనికులతో అతడు బయలుదేరుచున్నాడని పైన జెప్పబడిన తంతివార్తలు దెలుపుచున్నవి

ట్రాన్సు జార్డానియాలో గ్రామములను వాహాబీలు పట్టుకొనిరట బ్రిటిషు ట్రాన్సు కోవిలుదు గాపాడుచున్నవి, ముస్లిం దేశములందు పెద్ద అలజడి యయింపనని భయపడుచున్నారు అప్పను రాజు ఇంగ్లండుకు రానుండుటచే రాజకీయ వేత్తలు చాల కలవర పడుచున్నారు

### లామెంబరు నియోజనము

టి ఆర్ వేంకటరామ శాస్త్రిగారు చెన్నపురి ప్రభుత్వ లా మెంబరుగ నియమింపబడి నటులను, సి వి అనంత కృష్ణయ్యరుగారు అడ్వొకేటు జెనరలుగ నియమింప బడినటులను, పి వెంకట రమణరావు నాయుడుగారు ప్రభుత్వ న్యాయవాదిగ నియమింప బడినటులను, ప్రభుత్వమువారు ప్రకటించిరి

## ఆంధ్రవిశ్వ విద్యాలయము

మార్చి ౯,— తేదీన జరిగిన ఆంధ్రవిశ్వ కళా పరిషత్తుయొక్క సాంవత్సరిక సెనెటు సమావేశమునందు యిదివరలో వైసు ఛాన్సలరు పదవి యందుండిన శ్రీ కట్టమంచి రామలింగా రెడ్డిగారు ఏకగ్రీవముగ సభవారిచే తిరిగి ఎన్నుకొనబడిరి యిదివరలో రిజిస్ట్రారుగ పనిచేయుచున్న శ్రీ సి, డి, సుబ్రహ్మణ్య చెట్టిగారు అత్యధిక సంఖ్యాకులచే తిరిగి రిజిస్ట్రారుగ ఎన్నుకొన బడిరి శ్రీ రెడ్డిగారి యోగ్యతలను ప్రశంస నియమగు సెనెటు కొనియాడుచు సభ్యులనేకులచే ప్రసంగములు గావింపబడెను ఎన్నికలు ముగిసినపిమ్మట కార్యక్రమ పట్టికయందలి యితర విషయములపై చర్చ గావింపబడెను విశ్వ కళాపరిషత్తు ఆదాయ వ్యయపట్టిక కొంత చర్చ జరిగినపిమ్మట ఆమోదింపబడెను సభకు సుమారు ౫౦ గురు సభ్యులు హాజరైరి గ్యాలరీలపై కొందరు ప్రేక్షకులును యుండిరి,

విజయనగరము సంస్కృత కళాశాల ప్రధానాచార్యులును, సుప్రసిద్ధ పండితవరేణ్యులగు డా॥ బి॥ కిళాంబి రామానుజాచార్యులు (డి లిట్) గారి మరణమునకై వైసు ఛాన్సలరు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు సెనెటు సభ్యులందరి పక్షమునను సంతాపమును వెల్లడించిరి

పిమ్మట సభవారు ప్రశ్నోత్తరములను చర్చించిరి. ఆంధ్రవిశ్వ కళా పరిషత్తువారు ౧౯౩౬ సెప్టెంబరు మాసములో గావించిన సప్లిమెంటల్ పరీక్షలందు ఇంటరు మీడియేటు పరీక్ష ఫలితములు చాల నిరుత్సాహకరముగ నున్నవని యు, కృతార్థులైనవారి సంఖ్య చాల స్వల్పముగను రాష్ట్రమంతటను తెలియుచున్నటుల సభ్యులు కొందరు ఈ ప్రశ్నముల మూలమున వైసు ఛాన్సలరుగారికి నివేదించిరి, అందుకు ప్రజాభిప్రాయమేమియు నిరు దేయబడి యుండలేదనియు, పరీక్షలలో స్వల్ప సంఖ్యాకుల కృతార్థత్వముగా ప్రజలకు అసౌకర్యమును గలిగించి యుండదని పల్కిరి

భోజ నానంతరము ౨—౩౦ గంటలకు తిరిగి సమావేశమైనపుడు సభ్యులచే నోటీసు ఒసంగబడిన అధికారేతర కార్యక్రమమునందలి తీర్మానములు చాలా భాగము చర్చింపబడెను తెలుగు భాషయందు శాస్త్రీయ గ్రంథములను వ్రాయుటకుగాను సాంకేతిక పదములకై నిఘంటువు నొకదానిని (గ్లోసరీ) తయారు జేయవలసినదిగ శ్రీ జయంతి రామయ్య పంతులుగారు ప్రతిపాదించిన తీర్మానముపై ౪౦ నిముసములు తీవ్రముగ చర్చ జరిగెను తుదకు తీర్మానము అధిక సంఖ్యాకులచే నోడింపబడెను ఆంధ్రవిశ్వ కళా పరిషత్ప్రతినిధిని చెన్నపురి శాసన సభయందు వేర్పాటుజేయుట కావలెనగు ఆ గీ, రింపబడెను పిమ్మట సభ ౫ గంటలకు ముగింపబడెను

---

## ప్రకటన

---

మహాఘనత వహించిన శ్రీ నిజామువారి గారంటీడ్ స్టేట్ రైల్వే కంపెని లిమిటెడ్

---

### ఫ్లాగ్ స్టేషన్—

రాయనపాడు

యన్ జి. యస్. రైల్వే పెద్దలైనులో కొండపల్లి స్టేషనుకును బెజవాడ స్టేషనుకును మధ్యనుండు,

### రాయనపాడు

అనుస్థలము ఫ్లాగ్‌స్టేషన్ Flag Station గా నియమింప బడినది. ఇచ్చట ౧౯౩౭ మార్చినెల ౧౫వ తేదీనుండి ప్రయాణీకులకు టిక్కెట్లివ్వ బడును. లగ్గేజి, పార్సెళ్ళు, రైలుకెక్కించ బడును. మరియు ౧౯౩౭ మే నెల ౧వ తేదీనుండి "ఘ్రూబుక్కింగు" చేయ బడును.

| | |
|---|---|
| ట్రాఫిక్ మేజనేరు ఆఫీసు సికింద్రాబాదు (దక్కన్) | జి. పెడ్డీ ట్రాఫిక్ మేనేజరు (ఆజ్ఞచేత) |

# గ్రామ సమాచారములు

## భూమ్యాదాయ శాఖాధికారులు

### శ్రద్ధగైకొనెదరా?

[ఒక ఔరంగాబాద నివాసి]

ఔరంగాబాదునందు పూర్వము సూబేదారి కచ్చేరి యుండెను. కాని యది తరువాత నది సదరు నిజామతువరల్ గా మార్చబడినది. సూబేదారి యున్నపుడు నాల్గు జిల్లాలు దీని యధికారమున నుండెను. కాని యిప్పుడు ఎనిమిది జిల్లాలుగలవు. ఇట్లు మార్పుటవలన మొదటికన్న నెక్కువ చిక్కులు శాఖలు బయలు దేరినవి. ౧ మాలు, ౨ బందోబస్తు, ౩ లోకల్బందు, ౪ జంగలాతు. మొ. వీనిలో కొన్నిటి యపీల్లువినుట, దఫ్తరములు తనిఖీ చేసి రిపోర్టిచ్చుట, అధికారుల మార్పులు చేయుట, మార్పులంగీకరింపకుండుట, దౌరాలు చేయుచు ప్రజల బాధలని వృత్తి మొదలగు పనులెన్ని సక్రమముగా జరుగునో యది యందలి దానినుండి తెలియగలదు:—

దరఖాస్తుదారులు తమ దరఖాస్తులిచ్చి కొన్న తరువాత నది మాసాలాలో కనీసము ౫, ౧౦ రోజులైన పడియుండనిది సేగా మీదికిబోదు. దరఖాస్తే నాడువచ్చునో యానాడే దాని ఖతావనియై పోదు; ఇందలి సత్యాసత్యత మామూలా రజిష్టరు గాంచినచో గోచరింప గలదు. పేజ్ సుసారి సెపరైన నిచ్చినచో నతని పని పేజ్ సుసారి నమలునంతే సేపటిలో చేయబడిపోవును. తరువాత సేగాలోనికి పోయిన పాపము వారు బీడీ సిగరెట్లు కొనుచు చూచుచు స్వస్థచిత్తముతో గూర్చుని యుందురు.

అధికారుల దౌరాలు తఱచుగా జరుగుచుండును. వాండ్రేదైన మంచి యూరమకొంచేసి, చుట్టుప్రక్క యూళ్ల పటేల్ పట్వారీల బిలచి వారి దఫ్తరముల తనిఖీ చేసితిమని వ్రాసి వెడలిపోయెదరు. పటేలు పట్వారీలు తమ యధీనమొనర్పబడిన పనిని సకాలమునకు బాజాబితా చేయుచున్నారా లేదా యని దౌరాచేయు అధికార్లు విచారించెదరో లేదో సంశయమే! ఎందుకన మాల్గుజారీ, తకావి, బాకీలెన్నియో సంవత్సరములనుండి ఒకాయాలు గానున్నవి. దీనిపై నెవ్వరును లక్ష్యమిచ్చుట లేదు. ఎందుకన నూయూరికి దొరకు మామూలు దొరకినంతనే తనిఖీయై పోవును. కాని యీ సంవత్సరమున మిష్టర్ టాస్కర్ గారు బకాయ రకమంతయు వసూలుగాకున్న తహసీలుదారుల యొక్కయు, తాలుకదారుల యొక్కయు జీతము లాపబడునని హుకుం నిచ్చియున్నారు. దీని పరిణామముగ పేద ప్రజలు ఇండ్లు, వాకిళ్లు అమ్మి చేలు చాలముల కుదువబెట్టి బాకీ చెల్లించుచున్నారు.

దీన ప్రజల దుస్థితి యిట్లున్నది. పై యధికారులు ఈ విషయమును లక్ష్యపెట్టి, తగిన వ్యవస్థను చేయుదురు గాక యని ప్రార్థన.

(నిజాం విజయ)

## వనపర్తి

### ప్రజలలో సంచలనము—మహారాజాగారి యాగమనము

(స్వకీయ విలేఖరి)

శ్రీమంతు మహారాజా రామదేవరావు బహద్దరుగారు ౨౮ వ ఫర్వర్ది బుధవారము నాడు స్వయముగా తమ వివాహమునకు మహారాణి గోపాల్ పేట గారిని ఆహ్వానించుటకై వనపర్తి సంస్థాన మార్గముగనె వెళ్లునురను వార్త నాటి ప్రొద్దుననే జనులలో వ్యాపించి యుండెను. సంస్థానపు చుట్టుపట్ల ప్రజలందరు గుంపులు గుంపులుగా కూడి ౨ గంటలనుండే శ్రీరాజాగారి రాకడకై సంతోష స్వాంతులై నరీక్షించు చుండిరి. సాయంత్రము ౫ గంటలకు శ్రీ రాజగారు తమ మోటారుపై దయచేసి నిరీక్షించుచుండు ప్రజలకు దర్శన మొసగిరి. ప్రజలందరు యేక కంఠముగా "తామెప్పుడు సంస్థానపీఠ మలంకరింతురనియు, మరి మేమెప్పుడు సంతోష స్వాంతుల మగుదుమనియు" తమ అభిప్రాయమును వెలిబుచ్చిరి. శ్రీ రాజాగారు తమ ప్రజలు చూపినటువంటి భక్తి ప్రేమలకు మిక్కిలి విచార మనస్కులై విషాదముతో నశ్రు పూరితనయనులైరి. ప్రజలందరు "రామ" రాజ్యమునకై హస్తముల నెత్తి ఈశ్వరుని ప్రార్థించిరి: ఈ వార్త గత సంచిక కాలస్యముగ చేరుటచే నిపుడు ప్రచురింపబడినది. (గో. సం.)

## బాన్సువాడ

ఈ గ్రామమునకు బోధనం తాలూకా, నిజామాబాద జిల్లా. పూర్వము అనగా ౧౩౩౧ ఫసలీవరకు నిదే తాలూకాగా నుండెను. గాని తర్వాత బోధనం పై తాలూకా మార్చబడెను.

ఈ సంవత్సర బహమన్ నెలలో టాస్కరు గారు బోధనంకుమారుగా బాన్సువాడ తాలూకా చేసే యభిప్రాయముచే దౌరగావచ్చి యిక్కడ ఎనిమిది దినములు విచ్చి విచారణ సల్పిరి. కాని దాని పరిణామమేమియు తెలియలేదు. యిక్కడి జనసంఖ్య (౫౬౦౦) యిందులో నధిక భాగము హిందువులే!

### పాఠశాలలు

ఇక్కడ తహతానియా మదరసగలదు. కాని శిక్ష బాగుగా లేనందున పిల్లల సంఖ్య కొలదియై ఫాన్గి పాఠశాల లధికమయ్యెను.

### గ్రంథాలయము లేక క్లబ్బు

శ్రీయుత యస్. శ్రీనివాసరావు డాక్టరు గారు శ్రద్ధగైకొని యొక గ్రంథాలయము స్థాపించిరి. యిందులో పుస్తకములేగాక ఆటలకు తగిన సామగ్రులుగూడ గలవు. ఈ గ్రంథాలయమునకు చందాలు క్రమముగా ముట్టుచునుండెను. ప్రతి శుక్రవారము "తెలుగు" ఉరుదులో ఉపన్యాసములు జరుగుచుండెను. యిట్లు కొంతకాలము గడచిన పిదప యిదే సంకే ఆవ్వల్ తాలుకదారుగారి దౌరాలో ఒక దూరదృష్టి గల అరబు షికాయతుచేసి ఆటక్లబ్బును తీసివేయునటుగా జేసెను. ఇందులో తెలుగు, ఉరుదు, ఇంగ్లీషు పుస్తకములు గలవు. ప్రస్తుతము అట్టి పుస్తకములు వదరికగ నున్నవి.

### విద్యు యంత్రము

ఇక్కడొక విద్యుద్యంత్రము విఠలరెడ్డి మరియు విశ్వనాథ్యగారి భాగములో స్థాపించబడినది.

## ఎర్రుపాలెము

(స్వకీయ విలేఖరి)

### కాలమానము

ఎండలు ముదురుచున్నవి. ముందున్నది ముసళ్ల పండుగ అన్నట్లు వైశాఖ మాసములో ఈ గ్రామములోని ఎండల తీవ్రత ఎట్లుండునో?

### ప్లేగు కేసు

హైదరాబాదు నుండి తేబడిన యొక ౧౦ వత్సరముల బాలికకు వరంగల్ స్టేషనులో జ్వరము ఆరంభమై యిచ్చటికి వచ్చిన తరువాత నాల్గవదినమున మరణము సంభవించినది. ఈ బాలిక చికిత్సకొరకు డాక్టరు రామస్వామి నాయుడు (హైదరాబాదు) గారును వచ్చి ప్రయత్నించిరి. నిష్ఫలమయ్యెను.

### మసీదు కరోడ్గిరి కచ్చేరీల నిర్మాణమాపబడినది

ఇచ్చట నొక మసీదు, రైల్వే కరోడ్గిరి సంబంధమైన యొక్క నివాసగృహము కట్టబడు చుండినవి. స్పెషలు తాలూకదారు (హైదరాబాదు) గారు గ్రామపు మొకద్దం పట్వారీల పేర, పై రెంట నిర్మాణమును ఆపి వేయవలసినదని ఆజ్ఞాపించిరి. కనుక పనులు ఆపివేయ బడినవి.

### భోగము మేళము చర్చ

సుమారు మాసము దినముల క్రింద శ్రీ తహసీలుదారుగారిచ్చటికి దౌరాకు రాగా వారిని సన్మానించుటకై కొండపల్లినుండి భోగము మేళము తెప్పింపబడి యుండినట్లు ఇదివరకు గోలకొండ పత్రికలో వార్తల క్రింద ప్రకటింపబడి యుండెనుకదా. ఈ విషయములో కొంత పొరపాటు కలిగినదనియు, భోగము మేళము వాండ్లనుంతట వాండ్లే ఈ గ్రామమునకు శ్రీ తహసీలుదారుగారిచ్చట ఉన్న దినములలో కాకతాళీయముగా వచ్చిరనియు, శ్రీవారిని తమ నృత్యగానముల చేత రంజింపజేసి బహుమానము పొందిరనియు, శ్రీవారి సన్మానముకొరకు గ్రామస్థుల పిలిపించిన మాటమాత్రము వాస్తవము గాదని తెలియుచున్నది.

### గ్రామోద్యోగుల కష్టములు

వీరి దఫ్తరమునకు సర్కారు జంత్రీ ప్రకారము దొర కనవలసిన సాదరు ద్రవ్యము దొరకుటలేదని ఈ గ్రామోద్యోగస్థులు ఇతర గ్రామముల కరణములును అన్నిలు తాలూకుదారుగారి వద్ద దరఖాస్తులు పెట్టుకొనిరికదా. సంవత్సరమైనను తహసీలుకచేరీనుండి శ్రీ తాలూకుదారుగారికి నివేదిక పోనందున గ్రామోద్యోగస్థులకు ఈ విషయమున న్యాయము జరుగలేదు. తహసీలుదారుగారు న్యాయము జరిపి ఖమ్మం తాలూకా గ్రామోద్యోగస్థులకు గల ద్రవ్యలాభము ఈ తాలూకా లోనికి కలుగునట్లు ఏర్పాటుల చేయుదురు గాక!

### బంచరాయి సెస్సు

ఈ గ్రామములోని భూముల మాల్గుజారి రకంతో పాటు రూపాయికి ఒక అణా లోకల్బందు గాక వారియొక్క అర్ధణా బంచరాయి సెస్సు తీసికొనుచున్నారు. గ్రామమున బంచరాయి (పశువులమేపుటకు) భూమి ఒక ఎకరమైనను ఏర్పడిలేదట. బంచరాయి భూమి ఏర్పరచకయే బంచరాయి ద్రవ్యము పేద రైతులనుండి వసూలుచేయుట ఏమి న్యాయమో! రైతులు ఈ విషయమున టాస్కరు దొరగారికి దరఖాస్తులను పంపుకొనినచో న్యాయము జరుగగలదు.

# ఉపజ్ఞ వంశ క్రమానుగత మైనదా?

## 'పండిత పుత్రుల' స్థానమెద్ది?

గొప్పవారి బిడ్డలు వారి తండ్రుల శక్తులకు అనుగుణమైన శక్తిని గలిగి యుంటున్నారా?

పురాతనాధునిక గొప్ప వంశముల పరిశీలనానంతరము: ఉపజ్ఞ అల్ప మూలముల నుండిగూడ జనింపవచ్చుననియు, మేధాసంపన్నుల బిడ్డలు మేధావంతులుగనే యుందురు. గాని మార్గములు మాత్రము భిన్నముగ నున్నవనియు, విజ్ఞాన శాస్త్రజ్ఞుల, న్యాయవాదుల, రాజకీయవేత్తల బిడ్డలు సాధారణముగ వారి ననుసరించెదరు గాని, పోటక పుజనమున ఇది అరుదుగా నున్నదనియు తేలియున్నది.

### తలదాచుటకు యిల్లులేక చెట్లనీడన పెంపొందిన ప్రజ్ఞ

మధ్య యుగమున విఖ్యాతరాజకీయ వేత్తయయిన కార్డినల్ కల్‌సి ఒక కసాయివాని కొడుకు.

కవి సార్వభౌముడు షేక్స్పియరుగూడ కసాయివాని కొమారుడు. అంగడిలోనూడ కొంతకాలము పనిచేసినాడు.

శిల్పి చక్రవర్తి టర్నర్ మంగలివాని కొడుకు, మహాకవి కీట్సు గుర్రపువాని కొడుకు.

రాబర్టు బర్న్సు యంత్రశాలయందు పనివాని పుత్రుడు, యీయనగూడ కొంతకాలము అచట పని చేసెను. మొదట రైలు కనిపెట్టిన జార్జి స్టీఫెన్సన్ ఒక ఫైర్ మ్యాన్ కుమారుడు.

### తండ్రులకు భిన్నమైన ప్రతిభ

కవిశేఖరుడు టెనిసన్ ఒక మతబోధకుని కొడుకు, బ్రౌనింగు కవితండ్రి బ్యాంక్ ఆఫ్ ఇంగ్లండులో గుమస్తా.

మిల్టన్ మహాకవి వకీలు పుత్రుడు.

నవలారచయిత వాల్టర్ స్కాటు తండ్రి రాజమొహరుల అధికారికి గుమస్తా.

ఈ మధ్య విగత జీవులైన థామస్ హార్డి గారు బేలుదారి కుమారుడు.

టెనిసన్ కవి కుమారుడు మంచి ఆటగాడు.

### తండ్రులకు పేరు దెచ్చిన ప్రజ్ఞ

పెద్దలనుండి పిల్లలకు అనుగతముగ దిగిన ప్రజ్ఞ చాలవరకు యీనాటి రాజకీయ వేత్తలయందు కనుపించు చున్నది.

ప్రధాన మంత్రి బాల్డ్విన్ కుమారుడు సోషలిస్టు పక్షమునకు జెందిన ఆలివర్ బాల్డ్విన్, రాజకీయములలో పేరు పొందుచున్నాడు.

మనదేశములో నెహ్రూగారి కుటుంబము యింతియే.

### రాజకీయ కోవిదులైన బాలికలు

ఇజబెల్లా మాక్డొనాల్డు (రాంసే మాక్డొనాల్డు గారి కూతురు) మంచి వక్తగ పరిగణింపబడు చున్నది.

పార్లమెంటు మెంబరగు ఇరేను అను నామెకును ఆమె కూతురు ఎన్నికలలో చాల సహాయము చేసినది.

అస్క్విత్తుగారి కొమారుడు రేమాండు అస్క్విత్తు పార్లమెంటు ఎన్నికలలో పోటీచేసినాడు. ౧౯౧౬ లో యుద్ధములో చనిపోయినాడు. కనిష్ఠ పుత్రుడు అంతోని ఫిలిం పరిశ్రమలో పాల్గొను చున్నాడు.

అధునిక మహాపండితుడు హెచ్. జి. వెల్సు క్రికెటు ఆటలతో జీవనము చేయుచుండినవాని కొమారుడు. ప్రస్తుతము చక్రవర్తి ఆస్థాన వైద్యుడు డాసన్ గారి తండ్రి ఒక శిల్పి.

సంగీతము మాత్రము వంశక్రమాను గతముగ నున్నది.

(సమదర్శిని)

---

